# ప్రతి

యేనునొక మాసపత్రిక

అష్టావధాని జానపాటి పట్టాభిరామశాస్త్రిచేఁ
ప్రచురింపఁబడుచున్నది.

గుంటూరుజిల్లా, పల్నాడుతాలూకా, జానపాడు.

సంపుటము 13 } 1921 సం॥ ఫిబ్రవరి నెల. { సంచిక 2

## విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు.

ప్రధానపోషకులకు రు 25 0 0 సహాయులకు రు 5 0 0

పోషకులకు రు 10 0 0 చందాదారులకు 3 0 0

చంద్రికా ముద్రాక్షరశాల, గుంటూరు.

Printed at the Chandrika Press, Guntur,
and published at Janapadu, by the Editor Ashtavadhani
Janapati Pattabhirama Sastry.

౨ ౹౦ ౧

బలవంత్ బహద్దు

## పోష:

1 రామసింగుగారు, నెల్లుట్ల పాపురపు సంస్థానము మేనేజరు,
2 తమ్మన రామకృష్ణయ్యగారు, మర్చెంటు, బందరు
3 రాయవరపు గవర్రాజు గారు, మూలపేట.
4 కొత్తా సూర్యనారాయణరావుగారు, మర్చెంటు, బెజవాడ
5 జాగర్లమూడి కుప్పుస్వామి నాయుడుగారు, కారంచేడు.
6 అల్లాడి లక్ష్మణరావుగారు, కరణం, జంగపల్లి.
7 రంగావఝ్ఝల హనుమయ్యగారు, జిల్లాకోర్టు వకీలు, నర్సారావుపేట.
8 గూడూరి వీరసాంబశివరావు సర్వేశపాండ్యాగారు, మానెకొండూరు.
9 కందుకూరు లక్ష్మీప్రసాదరావుబహాదూరుజమీందారుగారు, ఊర్లాం

## సహాయులు.

1 పట్వారి నారాయణరావుగారు, క్షీరసాగరము.
2 చింతలపాటి యజ్ఞయ్యగారు, మర్చెంటు, బెజవాడ.
3 జూలూరి వెంకటరత్నంగారు, వకీలు, గుంటూరు.
4 నెల్లుట్ల కేశవరావు దేశముఖుగారు, నెల్లుట్ల.
5 వెలమకన్ని శోభనాద్రిరావుగారు, అడ్లూరు సివారు.
6 వావిళ్ల వెంకటేశశాస్త్రిగారు, చెన్నపట్టణం.
7 పంచాయతీ సంఘమువారు, పిడుగురాళ్ల,
8 ఏలేశ్వరం వెంకటరత్నంగారు, మర్చెంటు, బెజవాడ.
9 ఎనమంద్ర లక్ష్మీనరసింహముగారు, మర్చెంటు బెజవాడ.
10 పెద్దిభట్ల వీరయ్యగారు, ప్లీడరు, బెజవాడ.
11 తిప్పరాజు కామేశ్వరరావుగ్గారు, కరణం దుగ్గిరాల.
12 పిల్లలమర్రి సోమయాజులుగ్గారు, తహసీలుదారు, ఒంగోలు.
13 కాకుమాను హనుమయ్యగారు, నర్సారావుపేట
14 రాచకొండ వెంకటరామయ్యగారు మర్చెంటు, వినుకొండ.
15 మిదకు కిషన్ రావు దేశముఖుగారు, నల్లబల్లి.
16 రావిప్రోలు రాఘవదీక్షితులుగారు, కాగుమూరు.
17 తంగెడ నరసింహారావుగారు, కరణం, మోజర్లంపాడు.
81 గోటేటి వేణుగోపాలరావుగారు, పోలీసు సబు యిన్స్పెక్టరు, పిడుగురా
19 నారపరాజు వెంకటలక్ష్మీనరసింహారావు దేశముఖుగారు, తమ్మవరం.
20 దేమె రాజారాంబావగారు [illegible] జమీందారు, దోమకొండ.

అభినవసరస్వతి

సంపుటము ౧౩ | జానపాడు. రౌద్రి సం॥ మాఘమాసము. | సంచిక ౨

# శ్రీ జగద్గురుపీఠము

శ్లో॥ నగురోరధికం నగురోరధికం నగురోరధికం నగురోరధికం
విదితం విదితం విదితం విదితం శివశాసనతశ్శివశాసనతః॥

శ్లో॥ దేవైర్వంద్యః కృతేభూద్విధి హరిగురురాడ్దక్షిణామూర్తిరూపః
దుర్వాసాస్సత్యహాసస్త్రత ఇహగిరిశో రామచంద్రాదిసేః
త్రేతాయాం వ్యాససూనుశ్శుక మునిరభవద్ద్వాపరే
వ్యాకుర్వన్వేదసూత్రార్థః కలియుగసమయే శంకరః

గురుపీఠాభిమానులారా! ధర్మాభిమానుల
శతకోటి భూమండల మండనాయమానంబగు
షుమారు రెండువేలసంవత్సరముల క్రిందట
తంబులు ప్రబలియుండ నారదప్రేరితులై
కైలాసంబునకుంబోయి కరంబులు జోడించి
అంతటలోకైక శంకరుండగుశంకరుండు

శ్లో॥ మనోరథంపూరయిష్యే । మాను
దుష్టాచారవినాశార్థం ధర్మసంస్థా
యతీంద్రశ్శంకరో నామ్నా భవిష్యామిః

దేవతలారా! నేను శంకరాచార్యనామముతో
నై భూతలమందవతరించి దుర్మతంబులనడంచి సద్ధర్మంబుల స్థా చెద మీమీ నెలవులకుంజని సుఖంబుగనుండుడని యాజ్ఞాపించి పరమదయాకరుండగు పరమేశ్వరుండు లోకానుగ్రహముకై విక్రమార్క మహారాజులవారి పదునాల్గవ శకమునకును గలియుగము మూడువేలయేబది యెనిమిది సంవత్సరములకును సరియయిన యీశ్వరసంవత్సర వైశాఖశుద్ధపంచమీతిథియందుఁ గేరళ (మళయాళ) దేశమునందుఁ గాలటి

యగ్రహారంబున విప్రకులావతంసుండగు శివగురుసతీగర్భ శుక్తిముక్తా
యమానంబై యవతరించి రెండవసంవత్సరమునందే యకారాద్యక్షర
ములనుచ్చరించుచు లౌకిక వైదికవిద్యలనన్నిటిని మూఁడవయేటనేర్చి
శంకసుం డయిదవయేట నుపనయనముగావించిన పిదప సన్న్యాసాశ్ర
మంబంగీకరించి భాష్యత్రయంబొనరించి శ్రుతిస్మృతులతో విపరీతవా
ములగు పండితోత్తముల జయించి సకలదుర్మతంబులు ఖండించి మ
పనం బొనరించి శ్రీమత్పరమహంస పరివ్రాజ కాచార్యేత్యాది
ావళీ విరాజమానుఁడగు భగవత్పాదాచార్యుండు శార
ంచి తుంగభద్రాతీరస్థిత ఋష్యశృంగపురమునందొక
చి తన్మఠమునందు శారదాదేవిం బ్రతిష్ఠించి శిష్యా
గ్రాచార్యుని తన్మఠాధిపతిగాననుగ్రహించినులా
ట దచ్ఛిష్యునకొప్పగించి ద్వాత్రింశ ద్వత్స
లాసమునకుంజేరెనను వృత్తాంతము గురు
విషయంబే కావున నేను మిక్కిలి నొక్కి
నా ?

పశాఖలుగా నేర్పడి పుష్పగిరి పీఠమనియు
శివగంగాపీఠమనియు నభినవ విరూపాక్షపీఠమ
నామములచే వ్యవహరింపఁబడుచున్నయవి. తత్తత్పీ
పలువెడలి తత్తద్దేశముల సంచారంబొనరించుచుఁ దీక్ష
ుతలచే శిష్యజనులం బునీతులంజేయుచు నున్నవారలు
.దా ...నపూర్వులు గురుసన్నిధింజేరి సాధ్యయనాది బ్రహ్మచర్య
వ్రతంబుసల్పుచు శ్రుతిస్మృతి పురాణాదులం జక్కఁగనభ్యసించి శ్రుతి
స్మృతిప్రసిద్ధంబులగు సత్కర్మములననుష్ఠింపుచుఁ గులాచారధర్మంబులం
బరిత్యజింపకయు మఱియొక సమయంబున దైవయోగముచేమత విరుద్ధ
ధర్మములు దటస్థమైనపుడు విప్రబృందమొక స్థలంబునంజేరి విమర్శించి
తత్తద్దోషంబులఁ బ్రతికాముఖంబున జగద్గురువులవారికిం దెలుపుకొని

శ్రీవారియాజ్ఞానుసారంబుగఁ బ్రవర్తింపుచుండిరని వినవచ్చెడిని.

కలిమహారాజుచే శాసింపఁబడు నికృష్టకాలంబునందు మనవారలు మందాత్ములై మన్వాదిస్మృతుల నభ్యసింపకయు వేదశాస్త్రముల యాథార్థ్యముం జక్కఁగఁ దెలియనేరకయు వేదంబులు పౌరుషేయంబులనియు, స్మృత్యర్థంబు లననుష్ఠేయంబులనియు మాతాపితృపిండప్రదానంబు లనవసరంబులనియు శిఖాయజ్ఞోపవీతంబులు శ్రమదాయకంబులనియు విగ్రహారాధనలు విచారకరంబులనియుఁ బీఠాధిపతులు మనకు గురువులుగారనియు, వారికి శిక్షాధికారము లేదనియు నిత్యాదిప్రగల్భములతో వేదశాస్త్రపురాణ గురుధిక్కారములం జేయుటకు మొదలిడిరి.

## ఆహా! యేమి కలికాలమహిమ?

పూర్వము విప్రకులాలంకారభూతుండును, శ్రీమంతుండు నగు పునహా బాజీరావుగారు ప్రభుత్వ మొనరించుచున్న సమయంబున రావుగారి గుఱ్ఱపుస్వారివారు, శ్రీజగద్గురువుల పాత్రసామానుల నపహరించిరనియు గురువులది తెలిసికొని కృష్ణశాస్త్రియను మఠశిష్యుని ద్వారమున బహిష్కారపత్రిక నంపిరనియు రావుగారది భక్తిపూర్వకముగా నందుకొని తద్వృత్తాంతమంతయుఁ బూర్ణముగాఁ దెలిసికొని గురుద్రవ్యాపహరణదోషాపనయనమునకై యథావిధిగ సభానుమతంబున స్మృత్యనుసారంబుగఁ బ్రాయశ్చిత్తమొనరించుకొని శ్రీవారిసన్నిధికేగి ప్రాయశ్చిత్తద్రవ్యమును గురువులకొసంగి శుద్ధపత్రంబు నందుకొని పునీతుండయ్యెననియుఁ బురాతనగాథ కర్ణాకర్ణికగా వినవచ్చెడిని. ఇంతియకాక యాంగ్లేయప్రభుత్వమువారుకూడఁ గులాచారవిచారాధికారంబును మన గురువులయందే యుంచియున్నట్లు స్పష్టంబుగాఁ గన్పట్టుచున్నయది. మనగురువులు మన దౌర్మనస్యమునుబట్టి మనజోలికి రాకుండ నుపేక్షాభావమును బొందియున్నవారు. వారికిఁ బూర్ణాధికారమున్నను "బ్రాహ్మణానామనేకత్వ" మను న్యా

యము౯ మనవారలేశాభిప్రాయములోనుండక పోవుటవలన వారా యధికారమును నాచారములోఁ బెట్టుట మానుకొనిరి.

కావున మహాశయులారా! "సతికుడ్యే చిత్రకర్మ" యను న్యాయము౯ మనకు గుర్వనుగ్రహము పూర్ణముగాఁ దటస్థమైనయెడల మనకు ముందెన్నియో శ్రేయస్సులు సమకూరఁగలవు. లేనియెడల, మన మధోలోకముఁ జేరుచున్నను కించకంతయు సందియముండదు. గురోరంఘ్రిపద్మే మనశ్చేన్నలగ్నం। తతఃకిం తతఃకిం తతఃకిం తతఃకిం.

"కలౌ వేదాంతినస్సర్వే" యను న్యాయము౯ నత్తరాభ్యాస మొనరించిన ప్రతిమనుజునకు శ్రీభగవద్గీతాగ్రంథము కరభూషణమై యుండును. దానిలో ప్రథమాధ్యాయమునం దర్జునుఁడు శ్రీకృష్ణ మూర్తితో మొఱఁబెట్టుకొని విచారమును బొందుచున్న యీక్రింది శ్లోకములను శ్రద్ధతోఁ దిలకింపుఁడు.

శ్లో॥ ధర్మేనష్టే కులం కృత్స్న మధర్మోఽభిభవత్యుత।
అధర్మాభిభవాత్కృష్ణ ప్రదుష్యంతి కులస్త్రియః।
స్త్రీషుదుష్టాసువార్ష్ణేయ జాయతే వర్ణసంకరః।
సంకరోనరకాయైవ కులఘ్నానాం కులస్యచ।
పతంతిపితరో హ్యేషాం లుప్తపిండోదకక్రియాః।
దోషైరేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః।
ఉత్సాద్యన్తే జాతిధర్మాః కులధర్మాశ్చశాశ్వతాః।
ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాంజనార్దన।
నరకేనియతం వాసో భవతీత్యనుశుశ్రుమః॥

ప్రప్రథమమునందు గుర్వనుగ్రహము సమకూరనిది ధర్మసంస్థాపనముగాదు గావున విద్యాభిమానులందఱును విద్యాశంకరానుగ్రహమునకై ప్రయత్నించుచు నాచార్యస్వాములఁ బ్రార్థింపుఁడు. ఆచార్యానుగ్రహము గలిగినచో మనమందఱము నిహంబున సౌఖ్యందన

వనితాది సమస్తభోగంబు లనుభవించి పిదప మోక్షసామ్రాజ్యముం
జెందెదను.

ఇట్లు,
నరసరావుపేట గ్రామనివాసి,
శంకరమంచి లక్ష్మీనారాయణశాస్త్రి

---

## భారతభూమి పూర్వస్థితి

తే॥ కమలనాభుని నాభిపద్మమునఁ బొడమె
నలువ, నలువకు నిలగల్గె, నిలయు రెండు
భాగములు సేయఁ బ్రాగర్ధభాగమునను
దనరె భారతవర్షంబు దక్షిణమున,

ఉ॥ కట్టనికోటయై హిమనగంబు మహోన్నతకూటకోటిఁ జూ
పట్టెడు నుత్తరంబునను వార్నిధి గంగను సింధుఁ గూడి చూ
పట్టెడుఁ బ్రాక్ప్రతీచులను భవ్యతరంబుగ దక్షిణాశఁ గ
న్పట్టెడు లంకకుం గపులొనర్చిన సేతువు దాని కెల్లలై,

మ॥ రమణీయత్వము సత్వసంపదయు హర్మ్యప్రాతముల్ భూరి ర
త్నమయోద్దామఖనిప్రకాండమును నానాభూధరోపేత భూ
ధ్రమనోజ్ఞత్వ మశేషజాతిమృగపక్షిద్రుమాద్య జీవాపగా
సముదాయంబులు గల్గి యీభరతరాష్ట్రంబొప్పు నత్యున్నతిన్

సీ॥ ఒకయూరినుండి వేఱొకయూరికిఁ జనుటకై
ఘంటాపథంబులు గ్రాలుచుండ
నాపథంబులు తస్కరావృతంబులుగాక
భటులచేఁ గాపాడఁబడుచునుండ
నాభటులు లొంగి దుర్వ్యాపారములు సేయ
కుండ రాజులు కాచుచుండువారు,
నారాజులం దతిగౌరవంబెసగ దీ
పింతురు మార్గణవితతి మఱియు,

నిరుగడల నీడకై చెట్లు వరుసలొప్ప
నచ్చటచ్చట డిగ్గియ లచ్చటచట
నుపవనంబులు ప్రపలును నొప్పుచుండు
బాటసారులగమి సదుపాయమునకు ౪

సీ॥ సకలవర్ణంబులు సాంకర్యములు లేక
సదమలరీతి నెసంగునాఁడు
రాజాభిమానంబు ప్రజ కృషియును గల్గి
విద్యలు శాస్త్రము ల్వెలయునాఁడు
రాజులకై ప్రజ ప్రజలకై రాజులు
నొండొరుల్ బాసటౌచున్న నాఁడు
తమతమవృత్తులఁ దవిలి యెల్లరు వాని
నొనర వృద్ధికిఁ దెచ్చుచున్న నాఁడు
దివ్యసౌధంబులును మఱి దివ్యవస్త్ర
ములును దివ్యాన్నమును దివ్యభూషణములు
వడసి తులఁదూఁగుచుండె సంపదలతోడ
భరతవర్షంబు హర్షసంపత్ప్రదంబు, ౫

మ॥ మనకై సౌఖ్యము లెల్ల మాని యటవీమధ్యంబునం గష్టభా
జనమై యట్టి తపఃప్రవృత్తిగొని భిక్షామాత్రసంతుష్టులై
చనుచీ రత్యధికు ల్మహాత్ములు మనీషావంతులం చన్యజా
తి నమోవాకము సేయఁ బొల్చు నతిభూతి న్వ్యపవర్ణం బిలన్, ౬

మ॥ మనలన్ బిడ్డలఁబోలెఁ బ్రోతురు కృపామగ్నాత్ములౌ త్స్వార్థ మొ
క్కని మేషంబును బోవనీయ రరివర్గంబన్న లేశంబునన్
జని వారుగ్రభుజార్జితాయతయశస్సంపన్ను లీజోదులం
చనువాదంబు గడించి యొప్పుదు రపార్యప్రాభవ క్షత్రియుల్, ౭

సీ॥ జనుల కష్టసుఖంబులను విచారించుచుఁ
దగురీతి నెల్లయొద్దదుల మాన్పి

మితరశ్మిఁ గొనుచు స్వస్థితికిఁ బాత్రములైన
వైభవంబులకు లోపములు లేక
నడుపుచు నాల్గువర్ణములకుఁ దగువృత్తు
లరసి తదుచితవిద్యాభివృద్ధి
యొనఁగ వర్తకము కరిసేనము గోరక్ష
ణము మొదలైనకర్మముల శాస్త్ర
విధిగఁ జేయించి వేనవేల్విత్తములను
దేశవృద్ధికి వెచ్చించి తేజ మొప్ప
మంత్రిమంత్రులబుద్ధులఁ గొంచు రాజ్య
పాలనముసేయుచుందురు ప్రభువులచట, ౮

సీ॥ పడవ లోడలు పొగపడవలు మొదలైన
యానంబులెక్కి ప్రయాణములను
జేసి దేశములు వీక్షించి యూళులయందుఁ
బట్టణంబుల జనపదములందు
రాజధానులయందు రాజిల్లు ప్రజల యా
చారంబు లరయుచు వారికెల్ల
వలయు వస్తువులు నేర్పరులగు తమవారి
వలనఁ గల్పించి తద్వస్తుసమితి
నెగుమతులు సేసి లెక్కకు నెక్కుడైన
ధనముగడియించి తమవర్ణధర్మములకు
బాహిరముగాక దేవతాభక్తిగలిగి
యచట బేహారికాలము పొల్పొందు, మఱియు ౯

సీ॥ ఏసస్య మేనేల నేకాలమున నెట్టి
యెరువునఁ బండు నేయే పదార్థ
ములచేత నెంతెంతగలుగు లాభము వాని
కెనఁగు కష్టము వెచ్చమెంత దాఁక

నని వితర్కించి విద్యామూర్తులగు బ్రాహ్మ
ణులఁ బోషకులగు రాజులను జేర
పారంబు లెఱిఁగిన యూరవ్యులను విమ
ర్శించి తద్ధితబోధ సేద్యగాండ్రు
పాడిపంటలబలుపుచేఁ బ్రబలి పన్ను
లడుగక యమున్న తీర్చి సౌఖ్యములఁ దేలు
చుం దితాగ్రజదేవతా ద్యర్చనములఁ
గఁను నెఱఁగి యొప్పుచుందురు కాఁపులచట, ౧౦

వ॥ ఇప్పగిది నన్యోన్యోపకారాయత్తచిత్తులై స్వవృత్తులయం దభిమానగౌరవంబులుగలిగి నలుకొలముల వారును బరస్పరమైత్రిం బ్రవర్తించుచున్నెడ ౧౧

సీ॥ బంగరు మొదలైన పలులోహములయందుఁ
జందనాదిక కాష్ఠజాతియందు
నేనుగుదంతములందు మృగశృంగములయందు
శిలలందు మణులందుఁ జెక్కడంపుఁ
బనులచేఁ జెలువారు బహువిధవస్తువుల్
పట్టు రోమము నార ప్రత్తియు మొద
లగువానిచే నేసినట్టి వస్త్రంబులు
సృష్టిచిత్రములు వ్రాసిన పటములు
సిలువుటద్దాలు ఫలము లనేకభక్ష్య
ములు వివిధవాద్యములు నోషధులును భరత
ఖండ మొసఁగు మనుండె నఖండసరణి
నెల్ల దేశములకుఁ గొల్లకొల్లగాఁగ, ౧౨

సీ॥ పంచభూతమ్ముల వ్యాపారములు వాని
మేళన మునఁబుట్టు మేటిశక్తు
లెఱిఁగి యొనరించు కార్యము లు లోకోపయో

గమనకు నవి దెచ్చు క్రమము బుద్ధి
బలమున నరసి లక్షలు కోట్లు వెచ్చించి
మూపరులకుఁ గడుచోద్యమొప్ప
నత్యున్నతని శాలయంత్ర శాలావళు
లమితములుగఁగట్టి యందుఁ గోన
మెఱుపుచే గాలిచేత నావిరుల చేత
ననుపుయంత్రసమూహంబు గడలుకొల్పి
ధరణియును దివి సంద్రంబుఁ దమకు నైన
సమగ నొప్పిరి భరతవర్షంపుఁ బ్రజలు, ౧౩

వ॥ ఇట్లన్నిటం గనుఫాగడ్తకెక్కి నాగరికత మిన్నుముట్టుచున్న భరతఖండంబునందు ౧౪

ఉ॥ రాజులు రాజులుం గడుఁ బరస్పరమైత్రి నెసంగ ధర్మవి
భ్రాజితులై ప్రజల్ శుభపరంపరఁ దేలుచు సృష్టికర్తయై
రాజిలు నాదిదేవుని బరాత్పరుఁ బెక్కువిధాలఁ గొల్చుచ
వ్యాజపరోపకార సముదంచితవర్తనల న్మెలంగుదుర్ ౧౫
ఉ॥ ఎచ్చటఁగన్న దేవళములే యెటఁజూచిన సత్రశాలలే
యెచ్చటఁగన్నఁ బుణ్యవనులే యెటఁజూచిన తీర్థసేవలే
యెచ్చటఁగన్న దానపరులే యెటఁగన్న దయాసముద్రులే
యెచ్చటఁగన్న భక్తవరులే కనుపట్టుచు రాధరాస్థలిన్, ౧౬
సీ॥ ఒక ప్రాణికొఱకు నాత్మసుకుమార దేహంబుఁ
గోసి యొసఁగిన కృపాసముద్రు
లవనిఁ బరోపకారార్థంబు వెన్నెముకఁ
దీసి యిచ్చిన ధైర్యధీసమగ్రు
లాడినమాటకై యాలుబిడ్డల రాజ్య
సంపదఁ బాసిన సత్యనిధులు
జనకు నానతి గొనసాగింప నడవుల

నిడుమలపాలైన యిద్ధకీర్తు
లర్ధరాత్రమునందు హోరనుచు వాన
గురియుచుండంగఁ దమయిల్లు గూలఁగొట్టి
యర్థింయింటికిఁ గలప పాపంబుచేసి
యశముగొనిన మహోదారు లెసఁగి రండు, ౧౭

తే॥ అట్టు లుచ్ఛ్రితవెలసిన యార్యభూమి
శతశతాబ్దంబు లక్షీణసంపదలకు
నునికియైయుండి ద్వాపరయుగమునందు
హైన్యముం జెందె దైవప్రాభవహానిఁ జేసి, ౧౮

తే॥ శకునిదుర్బోధలకుఁజిక్కి సాధులైన
పెద్దలను ధిక్కరించి దుర్వృత్తిఁబూని
యన్నదమ్ములతోఁబోరె సకట! యాసు
యోధనుఁడు, దానవచ్చె దుర్యోగ మటను, ౧౯

ఉ॥ క్షత్రియవీరులెల్లఁజని చచ్చిరి దుర్భరమైన యాహవ
క్షేత్రమునందుఁబోరి, విధిసేఁతకు నేమనవచ్చుఁ, బ్రాణ సే
మాత్రములక్ష్యపెట్ట కభిమన్యుఁడు నచ్చెచు, సూతజాహ్నవీ
పుత్రులు మగ్రింధి, రస్త్రగురువు ఁబడె, నీల్గిరి పాండవేయులున్, ౨౦

చం॥ వలదని తాతసెప్పె, విదిపాడికి దూరమటంచు ద్రోణుఁడున్
బలికెను, దాద్రి కూడదనె, బావయు సంధియె లెస్సయంచు బు
ద్ధులు తగఁజెప్పెఁ దల్లి యిదిదోసము రాయనె, నిట్టిపలుకు ల
త్తులువ సరాకరించి కట దుష్టుఁ డరిష్టము తెచ్చె సుర్వికిన్, ౨౧

ఉ॥ కోరినయూళ్ళులైదు నివిగో కొనిపొండని యొక్కమాటగా
వారికిఁ జెప్పియున్న యెడఁ బాండవు లాజికివత్తురే? సభా
స్తారులు ధారుణీశులు ఘనందని మెచ్చుచు మళ్ళి యూళ్ళకుం
బోరె, సుయోధనుం గొలిచి భూప్రజలందఱు నుండ్రి సుఖింపరే; ౨౨

చం॥ మఱఁదిని దన్ను నవ్వి యవమానము ద్రోవది సేసెనంచుఁ దా
విరసపుఁ బాదమాడి తగుపెద్దలు రోయ సభం గులాంగనాం
బరములు విప్పి క్రూరతఁ దృణమాత్రము జంకక చేసినట్టి య
ల్లరిపను లూరకేగునె, కులంబును దన్నును గాపుమా పదే, ౨౩

ఉ॥ వచ్చెడివాఁడు తానొకఁడు చావక యుగ్రరణంబునందు వి
వ్వచ్చుని గాండివంబునకు భానుసుతోగ్రశరాళి కగ్గినా
వచ్చెడి ద్రోణునల్లులకుఁ బావని పెన్గద కాహగాసుతో
ద్యచ్ఛటులాస్త్రసంతతికి నాహుతిఁ జేసె సమస్తరాజులన్, ౨౪

చం॥ వడముడిచేత వేత్రుటిని పర్విడు వేళ గిరీటిగాండివం
బడరెడు వేళ భీష్ముఁడును నస్త్రగురుండును గర్ణశల్యులున్
బుడమిని బడ్డ వేళ నికఁ బోరఁగ లేమని సేన లస్త్రముల్
విడిచిన వేళనైనఁ దెలివింగనఁ డాకురురాజు మూర్ఖుఁడై, ౨౫

ఉ॥ ఆహవదోహలుండు సకలాస్త్రవిదుండు గురుండు సూచికా
వ్యూహముఖంబునన్నిలిచి యున్నెడఁ బాండవడింభకుండు సం
దేహము లేక చొచ్చి తనతీవ్రశరంబులఁ జేసినట్టి య
వ్యాహతసాహసంబు గొనియాడరె భూప్రజలెల్ల నేఁటికిన్, ౨౬

చం॥ అనిమొన బిట్టు తాఁకి హృదయంబవియం దనుఁ గొట్టినట్టి ము
న్ననుమని సాహసంబునకు "మాయురె మాయురె,, యంచుఁ
దాళకే
తనుఁ డెద మెచ్చఁగా వినినతండ్రుల కాసుకుమారు చావుకం
టెను బెఱచావునుం గలుగునే, హాతి తల్లులచింత దీఱునే, ౨౭

ఉ॥ చిన్నటనాటనుండి తనుఁ బెంచిన భీష్మునికంటె నస్త్రసం
పన్నుఁ జేసినట్టి గురువర్యునికంటెను గన్నతండ్రికం
టె న్నలినాక్షుకంటె శకునిం బెదఁ జేసి తదీయబోధచే
నన్నివిధాలఁ దెచ్చె భరతావనికిం గురురాజు దుర్దశన్, ౨౮

సీ॥ సేనలు మోహరించెడు నేర్పుగలిగిన
సేనాధిపతులు నశించిరపుడు,
హయలక్షణంబు లాద్యంతంబు లెఱింగిన
సారథులెల్లను సమసిరపుడు,
గొప్ప యేనుగుల నూలుకొల్పి పోరించెడు
మావటీలెల్లరు మడిసిరపుడు,
ఒక్కండె మూఁడొక్కని పెక్కుసేనలఁ బోరు
శస్త్రవిద్యానిధు లడఁగిరపుడు,
ధర్మమెచ్చటఁ జెడక యుద్ధంబు సలుపు
రాజరాజాధిరాజులు గ్రమ్మిరపుడు,
శ్రీలతోఁ దులఁదూఁగుచుఁ జెలఁగుచున్న
భరతఖండంబు దుర్దశపాలుచేసి, ౨౯

॥ భూపతులేగినఁ బోషకభృతిలేమి
బ్రాహ్మణవర్ణంబు బ్రతుకు టెట్లు,
బ్రాహ్మణులు సెడిన విద్యత్సహాయము లేమి
వృత్తులు మహిని వర్ధిల్లు టెట్లు,
వృత్తులు చెడిపోవ బేరము లడుగంటి
యూరుజుల్ క్షేమంబు నొందు టెట్లు
లూరుజుల్ దిక్కరియుండ విత్తము లేమి
నవరవర్ణము సౌఖ్యమందు టెట్లు,
లవరవర్ణంబు సెడిన సస్యంబులెల్ల
నలవడుట యెట్లు, సస్యములలఁగకున్నఁ
బ్రజకు జీవన మెట్లు, జీవనము లేమి
దేశ మెట్లుండు యోజించి తెలియవలయు, 3౦

ఉ॥ చోడులు రాజులైరి, మఱి శూద్రులెల్లను మంత్రులైరి వా
ణ్యాపరులు జోదులైర పరిశుద్ధసుధర్మరత మత్తచిత్తు లా

చారము సెప్పవా రయిరి, జారులు దేశికులైరి కట్ట! యా
భారతభూమి యిట్టి దురవస్థలపాలయి చెందె దైన్యమున్,

ఉ॥ ఇట్టియవస్థవచ్చినపు డెక్కడిపరము, లేటియాశ్రమా,
లెట్టిప్రజైకమత్యమిఁక, నెచ్చటికర్మము, లేటిధర్మమిం
కెట్టిసుఖోపజీవన, మిఁకెక్కడి విద్య, లిఁకేటి వృత్తు, లిం
కెట్టినృపాలపాలనము, నెక్కడిరాజ్యము భారతావనిన్, 3౧

చం॥ సకలమహీశు లాపగిదిఁ జచ్చిన సుర్వర కేమిది, కర్రా
జకత ప్రసన్నమయ్యె, దివసంబులు చన్నకొలందిఁ దస్కర
ప్రకరము పీల్చిద్రోఁచుకొనెఁ, బ్రాణభయంబున వృత్తులెల్ల మా
ని కడు హీనులైరిఁ బ్రజ నీస్థితులంగని వసించె నర్తితిన్, 3౨

చం॥ తలుపులులేమిఁ గుక్కలు స్వతంత్రముగా సిలుసొచ్చురీతి రా
జులు నశియింపఁగాఁ గని తటాలునఁ జూచి విదేశజు లొక్కరొక్క రీ
యిలకరుదెంచి దోఁచుకొని రిచ్చకువచ్చినయట్లు వేలు ల
క్షలు మఱి కోట్లు సేయఁగల కాంచనరత్నచిరత్న వస్తువుల్, 33

ఉ॥ డచ్చులు పోర్చుగీజులు నెడాపెడఁ బొచ్చిరి, దోఁచియిచ్చకున్
వచ్చినయట్లు గ్రంథములపారముగాఁ గొనియేగి, రేమనన్
వచ్చును భారతీయుల యవస్థ, దినంబులుచాలకున్నఁ బై
పచ్చడము స్మరించెనఁట పక్షులు, నవ్విధమయ్యె నద్దియున్, 3౪

వ. ఇట్లన్నిటం జెడి భరతఖండంబు తొంటిసిరులం బాసి యత్యధమ దశకుం దిగిన హతశేషులు ను నతిదుర్బలులు ను నగు రాజకుమారులు దానిన్ భరియింప సత్తువ లేక దుర్దశలపాలైరి. దాన నార్యధర్మంబులు సెడియె. వర్ణంబులు సంకీర్ణంబు లయ్యె. వృత్తులు నశియించె, బ్రజల కీతిబాధలు మెండయ్యె. జీవితంబు దుర్లభంబయ్యె. ప్రాణార్థంబులకు సేమంబు లేకునికిఁ బ్రజ భయంబంది స్వేచ్ఛాసంచారంబు డిగి తమగృహంబులం దడఁగి కాలంబుపుచ్చె బలం బున్నవాఁ డెట్టిఁడయ్యు బలహీనుని నొంప సాగె. ఉత్తమవ

ర్ణం బగు నంటి హీనజాతికి నెళవొసంగె. నిప్పగిదిఁ గ్రమక్రమంబునఁ జెడు చున్న దేశంబుఁ గాంచి వగచి వృద్ధమహర్షిజనంబు దేశారిష్టంబుం దొలంగింప నుంకించి బాలురు నవద లగు రాచకొడుకులం జేరి యతికరుణంబుగా వారిసేమంబు లరసి వారికి హితోపదేశంబు సేసి తమకున్న దివ్యబలంబున మఱలఁ బ్రజలం దమవశంబు సేసికొని వేదంబులు ముఖస్థంబులు గావించి జనుల నడవడికిఁగా స్మృతులు నిర్మించి రాజ్యంబులు స్థాపించి న్యాయస్థానంబు లేర్పఱచి వ్యవహారకాండంబులు సాఁగించి భరతప్రపంచంబునుఁ గొంతవట్టు కలంకఁ దేర్చిరి. అయ్యెడ విద్యకలిమి బ్రాహ్మణవర్గంబును ననుగ్రహించి వారిశరణంబునొచ్చి భూపతు లెల్లవారిం బ్రధానులు గా నాచార్యులు గాఁ బరిగ్రహించి తత్సాహాయ్యంబున భూపరిపాలనంబుఁ గావింపఁ దొడఁగిరి. కావునఁ బాఱువారిలోడ్పాటు రాచవారి కనివార్యం బయ్యె. బ్రాహ్మణు లిప్పగిదిఁ బ్రపంచవ్యవహారభారంబునఁ దగిలి కొందఱు తమయాశ్రమధర్మంబులు నడపలేనివారైరి కొందఱవి నడుపఁ గంకణంబుఁ గట్టుకొనిరి. ఇట్లు తద్వర్ణం బిరుతెగ లయ్యె. నీరెండుతెగలం దొకరు లౌకికవ్యవహారంబులందును రెండవవారు మతాచరణంబులందునుఁ బ్రముఖులై మంత్రులు నుదీర్థులు నైరి. ఇవ్విధంబున రాజులకడ నతిగౌరవం బందుచు నతిప్రబలులై వర్తిల్లు చున్న బ్రాహ్మణులయెడ నితరవర్ణంబుల కసూయ యంకురితం బయ్యె, రాజులతో రాజులు పోరాటములు మానిరి. గాని ప్రజలలో జాతివైషమ్యంబులు పొడమి వారిలో వారొకళ్ళొకళ్ళు కయ్యంబులకు దొరకొనిరి. ఎంతఁ జేసినను నితరవర్ణంబులవారు విప్రులం గెలువఁ జాలరైరి. భూపాలురు బ్రాహ్మణు లన్న భయంపడ సాఁగిరి బ్రాహ్మణులు తమకుఁ గలిగిన యున్నతపదములను వంశపరంపరగ ననుభవించుచు గర్వించి క్రిందిజాతులపై నెక్కుడాధిపత్యము

సాగించి వేదబాహ్యంబు లగు పురాణగాథలను వెలయించి క్రిజలం
గర్మపరంపరయందు ముంచి మూఢాచారంబులు నించి యుద్రేకిం
చి రట్టియెడ. ౩౫

గీ. జగతి శుద్ధోదనుండను నా • మగధదేశ
పతి మహామాయ నా నొప్పు • పరమసాధ్వి
వలన సిద్ధార్థుఁ డనుపుత్రుఁ • బడసెఁ, గపిల
వస్తు వన నొప్పు పురమున • వరలె నతఁడు. ౩౬

శా. ఆసిద్ధార్థుఁడు పిన్ననాఁడె బహువి • ద్యావంతుఁడై యింద్రియ
వ్యాసంగంబునుఁ దల్లిదండ్రులను భా • ర్యాపుత్రులం దాసదా
సీసంఘంబును వీడి యాంతతప • శ్శ్రీ నొప్పెనత్యుద్యమో
త్సాసక్తిం బొలుపారు నిశ్చలమనో • వ్యాపారనిష్ణుండునై. ౩౭

చ. ధరణి నహింసకన్న నిఁక • ధర్మమునున్ మతి భూతకోటికిం
గరుణ యొసంగు సాయమున • కన్నను బుణ్యము సందఱన్సహో
దరసమదృష్టిచేఁ గనువి • ధంబునకన్నను నీతి యుం బరా
ర్పరు సరకమ్మొకం చెనుమ • తంబును లేదని దోచెదన్మతిన్,

ఉ. త్రోఁచిన త్రోడ నే జనుల • త్రోఁచిన భావము నచ్చటచ్చటన్
సూచన సేసెఁ జేసిన వి • శుద్ధమనస్కుల కెల్లఁ దన్మతం
బాచరణీయ మంచును య • థార్థమటంచును దోఁచఁ దోఁచినన్
ధీచతురుం డతండు తన • దివ్యమతంబును సాఁగె నంతటన్. ౩౯

గీ. అమ్మహాత్ముండు బోధించి • నట్టి బౌద్ధ
మతము కోసలమగధాధి • పతుల చేత
మొదట నవలంబితం బయి • పిదపఁ జీన
పఱకు వ్యాపించెఁ గొన్నియ • బ్దములలోన. ౪౦

గీ. ఇత్తెఱంగున నిఖిలవిం • ధ్యోత్తరప్ర
పంచమునఁ జీనపఱకు వ్యా • ప్తమయినట్టి

బౌద్ధమత మొక్కఁ కొంత నా ♦ బ్రాహ్మణాధి
పత్యము నడంపఁ దొడఁగెన ♦ ప్పట్టునందు. ౪౧

ఉ. ఇండియ యందు నుండుసిరి ♦ యెచ్చట లే దని గ్రీసురా జల
గ్జాండరు దండిసేనఁ గొని ♦ చయ్యన శీతనగంబు దాఁటి రా
నుండిన గందుబిరాజ పురు ♦ షోత్తమునామనృపాలుఁ డాతనిన్
భండనమం దెదుర్కొనుడు ♦ వానిమహోద్ధతికిం గలంగుచున్.

ఉ. దండిమగండు వీనిని వృ ♦ ధా చెనకం దగదంచు లోనల
గ్జాండరు మెచ్చి యాతనికి ♦ గౌరవము న్నెలకొల్పి వేగ వే
దండశతాంగఘోటకప ♦ దాతియుతం బగు సైన్య మెల్ల ను
ద్దండగతి న్మరల్చి మగ ♦ ధప్రభు మార్గమున నుద్యమింపుచున్.

చ. అలజడిఁ దద్బలంబులపు ♦ డాజికి నూల్కొన కిళ్ళకేగఁ గా
సెల విను మన్న గ్రీసువార ♦ చేయున దేమి యు లేక కొంతఁ జిం
తిలి యట నొక్క నిం బ్రతిని ♦ ధిన్ సెలుక స్సను వానినుంచి తా
వెలువడి యింటికేగెఁ దల ♦ పెట్టినకార్యము మాని యత్తఱిన్.

ఉ. నందులు పాటలీపురము ♦ నంబలు పెక్కు సహస్ర సూను మౌ
ర్యుం దమ మంత్రి చెప్పిన హి ♦ తోక్తులు చేకొని వెళ్ళఁగొట్టియు
బ్బందులు పెట్ట నాతఁ డొక ♦ బ్రాహ్మణునిన్ శరణంబు వేడితాఁ
జెందిన దైన్యము న్వినికి ♦ సేసిన నాతఁడు నుం గృపార్ద్రుఁ డై. ౪౫

ఉ. శక్యము కానితంత్రములు ♦ సయ్యనఁ బన్ని యమాత్యవర్యు ని
ర్వాక్యునిఁ జేసి గెల్చి రణ ♦ పారగు లై తగు గ్రీసువారితో
నైక్యముఁ జెంది నందకుల ♦ మంతయు నుగ్గుగఁ జేసి యిచ్చెఁ జా
ణక్యుఁడు చంద్రగుప్తునకు ♦ నంతదయ న్మగధాధిపత్యమున్. ౪౬

వ. ఇత్తెఱంగునఁ జంద్రగుప్తమౌర్యుండు మహాపద్మాదినందులఁ జక్కు
డఁచి చాణక్యసాహాయ్యంబున మగధసింహాసనం బధిష్ఠించి తనరా
జ్యంబును దన్నుం జెనకవచ్చిన గ్రీసురాజప్రతినిధి యగు సెల్యూక
సను నతని నోడించి యతనిపుత్త్రిం బెండ్లి యాడి యాగ్యమతింబవ

లంబించి యిరువదినాలు గేండ్లు రాజ్యంబుం బరిపాలించెఁ, బిదప
తనికుమారుండు బిందుసారుండను తండ్రికరణిను రాజ్యంబు నెక్కు-
డు పెంచి యిరువదియెనిమి దేండ్లు నిష్కంటకంబుగ రాజ్యం బేలె
నతనికుమారుం డశోకుం డసదృశపరాక్రముండై సౌరాష్ట్రకళిం-
గాంధ్రభూములఁ దన కైవసంబుఁ జేసికొని బహుధర్మనిరతుండై
రాజ్యం బేలె. కళింగ రాజుతో నతఁడు పోరునెడ యుద్ధంబున స-
మసినవీరభటుల కళేబరంబులు గాంచి తనకార్యంబున కేవపడి వాఁ-
టినుండి యుద్ధంబుల జోలి మాని భూతదయ ముఖ్యముగఁ జేర్కొ-
ను బుద్ధమతంబునందు మిగులఁ బ్రీతిగలవాఁడై తన్మతంబును
రాజసమ్మతంబుం జేసి తన్మతగురువుల కతిపయవిత్తంబు లగు విహా-
రంబులు గల్పించె. తనకుమారుని మహేంద్రునిఁ దనకూఁతు సం-
ఘమిత్రి యను దానిని సింహళంబునకనిచి తదధీశు బౌద్ధుం గావించె.
మఱియు ననేకమతాచార్యుల నంపి లాతిపిలాతులందుఁ దన్మతం-
బుం బోధింపఁ జేసె. పశుమారణంబు మాన్పి సకలజనోపయోగం-
బుగ ననేక వైద్యశాలలను దేవాగారంబులను ఘంటాపథంబులను
దీర్ఘికలను నిర్మింపం జేసి రాజాధిరాజబిరుదంబుఁ గైకొని చిర-
కాలం బాన్పృపాలనము రాజ్యంబు పాలించె. అతనివంశంబువా రా-
ఱునూరంబులు రాజ్యంబు సేసిరి. ఆరవతరంబునఁ బుష్యమిత్రుండను
సేనానాయకుండు రాజుం జంపి తాను సింహాసనం బధిష్ఠించె. అతఁ-
డతిదుర్బలుం డగుటవలనఁ గళింగసౌరాష్ట్రాంధ్రనాయకులు స్వ-
తంత్రులై తమతమ రాజ్యంబుల నేల సాఁగిరి. ఆంధ్రనాయకు లప్పు-
డు మిగులఁ బ్రబలులై వింధ్యపర్వతంబు దాఁకఁ దమ రాజ్యంబుఁ
బెంచిరి. పుష్యమిత్రుని కాలంబున మగధరాజ్యంబు కొంత తరిగె.
పిదప గుప్తవంశంబువారు కుమారగుప్త స్కంధగుప్తులు మగధదేశం-
బేలిరి. స్కంధగుప్తుని సుతుండు హూణవంశరాజగు తోరమాణను వా-
నిచే జయింపఁబడి మగధరాజ్యం బాతనికిఁ గోల్పోయె. తోరమా-

నుని పుత్త్రుండు మిహిరకులుఁడు. అతని రాక్షసకృత్యంబు చెప్పవలసి
కాదు. ఎల్లప్పుడు యుద్ధమునం దపేక్ష గలవాఁడగుచు రాజుల
తోఁ బోరాటములు సల్పి మిగుల జనక్షయంబుఁ గావించి చివర
కు మాళవమహీపతి యగు యశోధర్మునిచే జయింపఁబడియె. ఈ
యశోధర్ముండె విక్రమార్కనామాంతరంబున నుజ్జయినీనగరం
బు రాజధానిగా మాళవమగధాదిదేశంబు లేకచ్ఛత్రంబుగఁ బా
లించిన మహావీరశేఖరుండు. కాళిదాసవరరుచివరాహమిహిరాదు
లీ సార్వభౌముని యాస్థానంబున వన్నెకెక్కినవారు. విక్రమార్కుని
యనంతరంబున నతనివంశంబు వారు గుప్తవంశపు వారిచే జయింపఁబడి
రి. గుప్తవంశపు రాజులగు ప్రభాకరుండును నతనిపుత్త్రుండగు రాజ్యవర్ధ
నుండును వింధ్యోత్తరభాగంబును సుప్రసిద్ధంబుగఁ బాలించిరి. రాజ్యవర్ధ
నుని సుతుండు శిలాదిత్యుండు తన రాజధానిఁ గన్యాకుబ్జంబున స్థాపించి
హర్షవర్ధననామాంతరంబున ధనేశ్వరసింహాసనారూఢుండై నలువదేం
డ్లు రాజ్యంబు పాలించె. రత్నావళియను నాటకరాజంబు సంస్కృతం
బున నసదృశశక్తిని నిర్మించిన శ్రీహర్షకవి యితఁడే యనియం
దురు. కవిసార్వభౌములగు బాణభట్టభవభూతు లీ రాజచంద్రుని
యాస్థానంబు నలంకరించినవారు. శిలాదిత్యుండేఁబదేండ్లు రాజ్యం
బు పాలించి కీర్తిశేషుండయ్యె. అతని యనంతరంబున లలితాది
త్యుండను కాశ్మీరరాజు కన్యాకుబ్జనగరంబు సొచ్చి దానిసిరి యె
ల్ల హరించె. ఆలలితాదిత్యుండె భవభూతిమహాకవినిఁ దనరా
జ్యంబునకుఁ బట్టుకొనిపోయెనని యుఁ జెప్పుట కలదు. ఇది యు
ట్లుండ మహారాష్ట్రదేశాధీశ్వరుండును రాజపుత్త్రవంశజుఁడును
నగు పులికేశి యను మహారాజు పశ్చిమదేశంబున వల్లభిరాజుల నో
డించి యమితసంపదలచేఁ జెలువారుచున్న తద్రాజ్యంబును దన
యధీనంబు సేసికొని వింధ్యోత్తరభాగంబునఁ గన్యాకుబ్జంబువఱకుఁ
దన రాజ్యంబును బెంచి మిగులఁ బ్రసిద్ధికెక్కె. ఈమహీపతి చను

క్ష్యవంశజుఁడు ఇట్లు పెక్కండ్రు రాజపుత్త్రవంశజులు చెలరేఁగి యార్యావర్తంబు ను బ్రహ్మావర్తంబు ను నలమికొని యతిప్రబలు లై యార్యమతంబు నవలంబించి బౌద్ధులయొక్క వైషమ్యంబుఁబూ ని స్వతంత్రరాజ్యంబుఁ స్థాపించుకొని యుండసాగిరి. బ్రాహ్మణులు ను వారిపక్షంబు వహించి వారిచేగౌరవంబులందుచు వర్తిల్లిరి. కుమారిల భట్టుండు ను శంకరాచార్యుండు ను నప్పుడు దాక్షుకంబునుబోధిం చుచు నితరమతంబులను జక్కఁడంచిరి. అనేకశాఖలు గ విభాగింపఁబడి వేదనిషిద్ధంబు లగు దురాచారంబులచే నిండి యు న్న యార్యమతంబును సంస్కరించి శ్రీశంకరాచార్యుం డద్వైత మతంబును బోధించి ప్రజలైకమత్యంబు దొరకొల్పె. రాజపుత్త్ర మహీనాథు లెల్లను నయ్యాచార్యునిమతం బంగీకరించిరి బౌద్ధమ తంబు ను నప్పటికి క్షీణదశకుం దిగ యుండినకతంబునఁ దన్మ తావలంబకులు ను నీమద్భేదంబుచే వెలయును బౌద్ధమతమందలి యెల్లసదాచారంబులు గలిగి వెలయుచున్న శంకరుని యద్వైత మతంబును గౌరవపురస్సరంబు గ నంగీకరించిరి. కాన బౌద్ధులెల్ల రు నద్వైతులైరి. వారివిహారాగారంబులు దేవాగారంబులుగ మా ర్పఁబడి భారతరామాయణాదిపురాణకథానాయకుల విగ్రహంబు లందు స్థాపింపఁబడియె. అచిరకాలంబున నె శంకరాచార్యుం డిహ లోకముం డిగుట యు నమ్మహానీయుఁడు బోధించినమతంబందలి సత్యం బెఱుంగ లేక జనులు సర్వేశ్వరారాధనంబు విడి పురాణ కథానాయకులఁ దదవతారంబులు గ నెంచి సగుణారాధనంబుఁ బూనిరి. ఆచారంబు లెట్లున్నను నమ్మహనీయుని మేధాతిశయం బువలనను నయ్యాచార్యునిబోధనాసామర్థ్యంబువలనను దేశంబునం దుఁ దొంటిమతవైషమ్యంబు లేక యైకమత్యంబు గడలుకొనియె. రాజపుత్త్రభూమీశు లవిచ్ఛిన్నంబు గ స్వతంత్రరాజ్యంబు లచ్చ టచ్చట నిర్మించుకొని వర్ణాశ్రమధర్మంబులు కాపాడుకొనుచు

చువిషోల్బణంబులును మహాకాయంబులును నగు పన్నగంబులం బట్టి వధించుచు నొకనాఁడు మహారణ్యంబున వయోధికుండై పరుండియున్న యొక నీరుకట్టియం బొడగాంచి కాలదండోపమంబగు కట్టెను లేవనెత్తి కొట్టఁబోవుటయు నయ్యది ౭౩

క॥ "ఏమొనరించితినని నను నీమాడ్కిని సంభ్రమమున హింసించెదయా
భూమీసురవర! వృద్ధుని" నా మనుష్యయుతుండనగుచు నాతిని మదిలోన్ ౭౪

క॥ తలఁచుకొని యిట్టులంటిని జలసర్పముఁ జూచి "నాదుసతి నొకయహి తా
బలిమిని గఱచి వధించుట బలుపగగొని చంపుచుంటిఁ బాముల నిటులన్, ౭౫

చ॥ పనిచెద నిన్నుఁ గూడ యముపాలికిఁ జేర నభీష్ట మెద్ది యో
మనమున సంస్మరింపు మొకమా", అని దండము లేవనెత్త నా
పెనుఫణి వేపమానమయి పెద్దయెలుంగున "బ్రాహ్మణాగ్ర్య! భూ
జనుల విషాగ్నిదగ్ధులుగ సల్పెడి పాములఁ జంపు టర్హమౌ, ౭౬

క॥ విషమున జననం బందిన విషధరులమయయ్యు మేము విప్రవతంసా!
విషశూన్యుల మైయుందుము, వృష గాదిది, జరుపు మవల మేకొనినటులన్" ౭౭

మ॥ అని యిబ్భంగి వచించుచుండినను నే నా నీరుకట్టెం గడున్
ఘనహా కట్టియ నట్టెకొట్టుటయుఁ దీర్ఘంబైన యద్దాని స్ప
ర్శనమైనంతన దివ్యపూరుషుఁడుగా సర్పంబు గన్పట్టెఁ, జ
య్యన నేనంతఁ దదంఘ్రులందుఁ బడితిన్ సాష్టాంగమానట్లుగన్, ౭౮

ఉ॥ పడి పరమాద్భుతంపడుచు "బ్రాహ్మణశాపమొ, లేక లీలమైఁ
బుడమిఁ జరించుచుంటొ యిటు, పూర్వ మెవండవొ చెప్పి నేను నీ
యొడలనొనర్చినట్టిపని కీవు క్షమింపు మహానుభావ!", నా
వుడు హరిదశ్వతేజమునఁ బొల్చెడి తత్పురుషాగ్ర్యుఁడిట్లనెన్, ౭౯

సీ॥ వచ్చియు రాని బల్వాలపు మీసముల పైఁ గుడిచేయి తీయని కోడెకాఁడఁ
గంతు వసంతు దిసంతు గొట్టటుఁగాఁ జూచుచుండెడి మహాసుందరుండ
నంబరచుంబియౌ హర్మ్యాగ్రమునసుండి ధర్మవాత్రి భుజించు భాగ్యశాలిఁ
గూర్చున్నకడ కెల్ల కోరినవస్తువు తెప్పింపఁజాలు సద్వృష్టవంతుఁ
డై చమత్కారపురి నొక్క యవనిసురుని కొడుకనగుచును నటనొక్క కోంటి సేత
సలుపుటం జేసి శాకిట్టి సర్పతనువు దాపరించెను, వినుమయ్య దాని తెఱఁగు, ౮౦

తే॥ అచట సిద్ధేశ్వరంబన నమరుచట్టి లింగ మొండుండె నో భూనిలింపవర్య!
పెక్కుములచేత సర్వత్రి సేవగలిగి యలరెడిఁ దదాలయంబు శివాలయంబు, ౮౧

క॥ ఒకతఱిఁ దత్సిద్ధేశ్వరునకు జరిగె మహోత్సవంబు నానాగతులన్
సుకవి స్తవనీయములగు సకలమహావాద్యములకు స్థానంబగుచున్, ౯౩

సీ॥ పాశుపతులు జీర్ణపర్ణభక్షకులును శివునియం దతిభక్తిఁ జెలఁగువారు
శైవమతస్థులు సతతమహావ్రతుల్ ఫలభక్షణముచేసి పరఁగువారు
కాపాలికులును నేకభుజాలుచుటి నిరాహారవ్రతముఁబూని యలరువారు
వారిపానముతోన వర్తించువారును వాయుభిక్షుకులయి వగలువారు
నైన మునుల శతములు సహస్రములును నమ్మహామహ మీక్షింప నరుగుదెంచి
మ్రొక్కి సిద్ధేశ్వరునకు సంతోషమొప్ప నోజఁ గీర్తించి ప్రాచీనరాజఋషుల,

కం॥ నానావిధచరితంబు లనూనామోదంబుతోడ నూతనఫక్కిన్
బూని పరస్పర మాడుచు నానగరికి శోభగూర్చి రవనీవిబుధా! ౯౪

వ॥ మఱియును ౯౫

సీ॥ శ్రుతిలయోపేతమై శ్రుతికింపుఘటియించు మధురగానము కొంతమంది పాడి,
రంభపంగ్వాదుల కతిదయాదృష్టి నమందవిత్తముఁ గొంతమంది యిచ్చి;
రడుగడుగునకును మహాదేవయనుచుఁ దన్మయచిత్తమునఁ గొంతమంది యాడి,
రర్ఘ్యంబుఁ బాద్యంబు నవలీలఁ గల్పించి మానసార్చన కొంతమంది జరిపి,
రాప్రకారముగను నమ్మహోత్సవముగా యౌవనాతిరేక మావహించి
భవునియందు ద్వేషభావంబు సమకూర్పఁ జాలి నటకు దుష్టజనులఁ గూడి, ౯౬

కం॥ ఉత్సవభంగ మొనర్పఁగ మత్సరభృతులు కొంతమంది మంత్రము సెప్పన్
కుత్సితమతులై యటు చని సత్సముదయమునకు నెగ్గు సలిపిరి మిగులన్, ౯౭

సీ॥ కరము దీర్ఘంబైన ఘనగదాదండంబు నతికరించుచు నున్న యట్టిదాని
దర్శనమాత్రాన ధైర్యవంతునకైన గుండె బ్రద్దలుచేయుచుండుదానిఁ
బొడవైన తనవాల్కఁ బూనికమైఁ జాఁచి కోపంబుచే బుసకొట్టుదాని
శతవత్సరంబులు సంపూర్తికా మేనిభరముచేఁ గడు వ్యథంబడెడిదాని
నీరుకట్టె నొకటి నోఁ బట్టుకొనివచ్చి కుంపుగాఁగ నచటఁ గూడియున్న
జనముపైన వైవ సరవిఁ జెల్లాచెదరగుచుఁ బఱచె నకట! ప్రాణభీతి, ౯౮

వ॥ అట్టియెడ నమ్మహాజనమధ్యంబున ౯౯

సీ॥ అహరహఃప్రజ్వలితాత్మతపోగ్నిచేఁ గలుషాటవుల నెల్లఁ గాల్చివైచి
సజ్జనసందోహ సంస్తవనీయమహా నత్యుత్తమవ్రత మాశ్రయించి

వ॥ అనియిట్లు తచ్ఛిష్యుంగూర్చి వాక్రుచ్చి శంసితవ్రతుండగు సువ్రతుండు నాయెడలఁ బరమదయాళుండై "వీనివాక్యము తిరుగ నేరదు కావునఁ గుండలిశరీరుండ వయి కొంతకాలము నిరీక్షించు" మనుటయు నేను "మునిచంద్రమా! యజ్ఞాతశాపవిమోచనకాలుండగు నీవీనియెడ ననుగ్రహించి యక్కాలం బెఱింగింపవే" యని ప్రార్థింప నమ్మునిచంద్రుండు మఱియు నిట్లనియె, ౧౧౯

కం॥ "క్షణమాత్రమైన నిటలేక్షణుఁగుడి గీతాదికంబు గావించు విచ
క్షణు పుణ్యమెన్న నీధారుణిలో శక్యంబుగాదు పోర్దలకేనిన్, ౧౨౦

ఆ॥ నిమిషమాత్రమైన నిటలాక్షునుత్సవమ్మునకు నంతరాయమును నెవండు
నాచరింపఁగడఁగు నవ్వాని పాతకం బెన్నుటయు నశక్యమే తలంప, ౧౨౧

ఆ॥ ద్విజుఁడవయ్యుఁ జెఱిపి దేవతామహమును బాపివైతివీవు పన్నగంబ!
ముక్తిలేదు నీకు ముమ్మాటికిని గాని వినువచింతు నొక్క ఘనపథంబు, ౧౨౨

తే॥ శివషడక్షరమంత్రంబు శ్రీకరంబు శ్రద్ధతోఁగూడి యెవ్వండు జపముసేయు
బ్రహ్మవధనుండి పొడమిన పాపమేని నాశమొందంగఁగలదు తన్నరవరునకు, ౧౨౩

కం॥ పదిదినములపాపం బిరువదిదినములపాతకంబు వత్సరకృతమై
కుదురుకొనియున్న యఘమును బ్రిదులుఁ షడక్షరజపంబు పేర్మినిఁ గతిన్, ౧౨౪

ఉ॥ అన్యభవార్జితాఘమును యచ్ఛివమంత్రజపంబు పేర్మిమై
శూన్యతగాంచుచుండుఁ బరిశుద్ధజలంబులలోన నుండియా
ధన్యషడక్షరంబు నతితత్పరతన్ జపియింపు, మంత నీ
హైన్యముకొన్ని నాళులకు నంతమునొందు, శుభంబు చేకురున్ ౧౨౫

కం॥ ఎన్నఁడు జలమధ్యంబుననున్న నినున్ వత్సపాని యురులగుడముచే
తన్నులఁగఁబొడుచు క్రుద్ధత నన్నఁడు నీశాపమోక్షమగును పృదాకూ! ౧౨౬

తే॥ కాన నిటనుండి వేగంబ కదలి నీవు చేరు మొక్క జలాశయక్షేత్రమునకుఁ,
గించిదిష్టంబు నే వచియించినాఁడ" ననుచు విరమించె సువ్రతమునివరుండు, ౧౨౭

వ॥ అంత ౧౨౮

కం॥ ఉమ్మలికమ్మన నేనీ కమ్మనినీరమ్ముగలుగు కమలాకరరా
జమ్మునఁ జేరి కరం బనిశమ్ము షడక్షరజపంబు సలుపుచునుంటిన్, ౧౨౯

ఆ॥ భవదనుగ్రహమున బ్రాహ్మణాగ్రేసర! పాసినాఁడ నేను శాపయొదలు,
నేమిప్రియ మొనర్తు నిట్టి మహోపకారమ్మొనర్చు నీకు రయమ చెప్పుమ, ౧౩౦

ఉ॥ వత్సుండ వీవయాదు, విదివాస్తవ, మందున నిన్ను సర్వసం
పత్సముపేతుఁ జేయుట కావ్యము నా, కటుచేయుచుండినన్
గుత్సరయొనర్చు నార్యతతి, కెల్ల శుభీష్టము నిచ్చిపోదు, ని
గ్కృత్సర సుప్రతాజ్ఞను విమానవరంబును నేఁగుదెంచెడిన్" ౧౩౧

వ॥ అనియిట్లు వక్కాణించుటయు. ౧౩౨

సీ॥ "ప్రాణప్రియంబైన భామినీరత్నంబు నడవిపాలొనరించి యరుగుటయును
నన్నవస్త్రములకై యాయాగృహస్థుల బడిపంచలంబడి మిడుకుటయును
శ్లేష్మపిత్తాదులౌ చెనరోగములచేత బాధింపఁబడి యెప్డు బనవుటయును
బలుగాకులైన శత్రులవాక్శరంబులు వ్యథపెట్ట లోలోన వనరుటయును
సత్యతనములైనయస్మదప్రియము లియ్యవియు దివ్యపూరుషాగ్రగణ్య!
వీనిఁ దీర్పఁగలిగి వెలసెడి మంత్రోపదేశమిచ్చి నన్నుఁ దేర్పుమయ్య" ౧౩౩

వ॥ అని నేను సంప్రార్థించితి, నంత నప్పురుషోత్తముండు మార్గపరవశుండై మఱి
యుయునిట్లనియె, ౧౩౪

తే॥ "ప్రశ్నభారంబు నాపైనఁ బడియెఁగాని దేవయానస్థితుండనై దీని కిప్పు
డొసఁగఁజాలను విరివియౌ నుత్తరంబు, సంగ్రహంబుగ వచియించి చనెదవినుము,

కం॥ శైవమడక్షరమంత్రము భూవిబుధ! యమంగళంబుఁ బోవడచను, ద
త్పావనమంత్రము జపముంగావింపు మహర్నిశంబుఁ గడుభక్తిమెయిన్, ౧౩౬

చం॥ పదపడి పాతకంబువిడి స్వర్గమొ మోక్షమొ యింక నేది నీ
మదిఁ బిలాషఁజేతొ యది మానక పొందెదు, నేనుగూడ మున్
బెదపెదపాతకంబులనె పెక్కులొనర్చితి, నైనఁగాని నా
కొడవెమహోదయంబులగు నూర్ధ్వగతుల్ ద్విజ! మంత్రిసత్తచే, ౧౩౭

చం॥ ఒకఁడు సమస్తదానముల సద్విమురాలి కొసంగుభక్తి వే
ఱొకఁడు సమస్తతీర్థముల నోపిక లోడ మునింగివచ్చు నిం
కొకఁడు మహోజ్జ్వలత్తమునసుంచిమడక్షరమున్ జపించు వీ
రికి ధరణీసురాగ్ర్య! యొకరీతిఫలంబ లభింప నయ్యెడిన్, ౧౩౮

సీ॥ చాంద్రాయణవ్రతాచరణ సహస్రంబు శైవమడక్షరజపము నొకటె,
పితృపక్షకృత గయాపిండసహస్రంబు శైవమడక్షరజపము నొకటె,
కేదారభృగుపాతకృత్యసహస్రంబు శైవమడక్షరజపము నొకటె,

జ్యేష్ఠపుష్కరమునందిను గోసహస్రంబు శైవషడక్షరజపము నొకటి,
సర్వసంగపరిత్యాగ పూర్వకముగఁ బోరయుజ్ఞానంబు షడక్షరజపంబు
నొక్కటియు, కానఁ దజ్జపంబు తక్కరీతి నాచరింపఁగదయ్యయో యమానువర్య!

ఆ॥ ఉత్తరాయణమున నొక్కండు చండీశవర్యవంబొనర్పఁ దక్కొకండు
మహితశివషడర్ణ మంత్రంబుజపియించు, నుభయులొందుఫలము నొకవిధము, ౧౪౦

కం॥ సోమగ్రహణమున సోమనాథుని సోమగ్రహము నొకండు చూచు మఱొకఁడో
నేమమున శివషడక్షరమే మదిజపియించు ఫలిత మిరువురి దొకడే, ౧౪౧

కం॥ సూర్యగ్రహణంబున నొకయాజ్ఞ్యుఁడు సన్నిహితి మున్గ నన్యుండు మహా
స్థైర్యమున శైవమనుజపకార్యంబొనరించు రెంటఁగలఫల మొకటే, ౧౪౨

చం॥ విరివిగనున్న స్వార్థమును విప్రుల కర్పణఁజేసి యాదిలో
నెరవునుదింటు కబ్బసము నెంతయుఁజేయు నొకండు వేఱొకం
డఱమఱలేక తా శివషడక్షరమంత్రజపంబొనర్చు నీ
యిరువురునొందునట్టిఫల మెన్న సమానమగు తనర్చెను, ౧౪౩

వ॥ వానకాలంబున నజాచ్ఛాదితస్థలంబునఁ బరుండియుఁ జలికాలంబున జలంబులవసించియు నెండకాలంబునఁ బంచాగ్నిమధ్యంబుననుండియు నొక్కరుఁడు వర్షశతంబులు తపంబాచరించు, మఱియొకండు శుచియు శ్రద్ధాన్వితుండును నై యేయింబవళ్లును షడక్షరమంత్రంబు జపియించు, నీరెంటికిని గలుగు ఫలంబు సమానంబ, యీపరమరహస్యము నీకుంగా వ్రాకుచ్చితి, నియ్యది నాస్తికులకును భక్తిహీనులకును జెప్పఁదగినది గాని యది, నీమేల కోరి వేఱొకహితం బుపదేశించెద, నుత్తమగతి నభిలషింతువేని మదుక్తప్రకారం బొనరించు"మని యహింసం బ్రశంసింపుచు నప్పురుషుండు మఱియు నిట్లనియె

— అహింసా ప్రాశస్త్యము. —

ఆ॥ 'ఎల్ల వేదములు నహింసయు పరమధర్మంబుగాఁగఁ జెప్పె సుపేసురాగ్రజ!
యందు బ్రాహ్మణునకు నది ముఖ్యకర్తవ్య, మట్లుగాన నుసుగు మహితంబు,

ఆ॥ హింసకములుగాని యెల్లభూతములను నెవఁడు కరుణమాలి హింసపెట్టు
వాఁడు భూతసంప్లవంబగుపర్యంత మధికమైననరక మనుభవించు, ౧౪౪

కం॥ ఎవఁడు చరాచరములకుందవిలి సదా యభయ మొసఁగుఁ దప్పక వాఁడే ౧౪౫
యవని దివంబునఁగూడను నవు వివిధసుఖాదికముం డనాక్షేపముగ

ఆ॥ శివసమానమైన శ్రేష్ఠమౌదైవంబు గంగనుకరించు ఘనవనదియును
దయకుఁదుల్యమైన ధర్మంబు హింసకుంమలితమైనపాప ములనుగలద" ౧౪౬

## ప్రధానపోషకులు.

1 శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు.

2 రాజా వెల్లపురవల వెంకటరాఘవేంద్రరావు బహద్దూర్,
జాగీర్దారుగారు, నవాబుపేట

3 రాజా రాజు పరాంకుశరావు దేశముఖుగారు. యాడవరం.

### ఈనెల సొమ్ము చెల్లించిన చందాదారులు

1 చివుకుల వెంకటశాస్త్రిగారు, డిప్యూటీ తహశీల్దారు, తిరుత్తని
2 కె. శేషగిరిరావుగారు, మెడికల్ ప్రాక్టీషనరు, బందరు
3 మంచికంటి వెంకటరామయ్యగారు, కంట్రాక్టరు, నర్సారావుపేట
4 నాదేపల్లి వెంకటప్పయ్యశాస్త్రిగారు, చందోలు
5 వాళ్ళం కృష్ణారావుగారు, రాజమండ్రి
6 నేతి ఉమాకాంతంగారు, బోర్డు హైస్కూలు హెడ్మాస్టరు, డోన్
7 మల్లావఝ్ఝల రాజగోపాలంగారు, భువనగిరి
8 నల్లా గణేశంగారు, మర్చెంటు, సికింద్రాబాదు

---

(తెనాలి గ్రామదండు కార్యాలయ ప్రచురణము.)

---

శా॥ విద్వాన్ సైదోడుట వంగరాష్ట్రమున నిర్మించె మాతృద్వేషైకదీ
క్షా సంకల్పమునన్ నిరంకుశన ముత్సాహంబునన్ దాస్యవి
ధ్వాసవ్యాసమువచ్చు వార్తయు దిగంతక్రాంతమై ప్రేమయు ఛీ
ఛీ సిగ్గేటికి లేదో, యాంధ్రయువకా జీవంబు నిర్జీవమో॥

మ॥ "తలఁ గాంధీయు గమే కదెంచె, నిఁక నేతద్భారతీయ స్వరా
జ్యరథం బాతఁ సారథిత్వమున నే సాగింపు"డంచున్ జగ
ద్గురు డౌరా దివి లోకమాన్యుఁ డని యుద్ఘోషించె కార్యధ్యముల్,
ఉరుతద్దివ్యరథంబు లాగుటకు రండో భారతీయవ్రజల్!

మ॥ తరణోపాయము భారతీయులకు నేతద్భారతీయ స్వరా
జ్యరథంబౌనుట గాక కేవలము తే దా బాలగోపాల మం
గతికిన్ గార్యధురంధరత్వమున తగున్ దచ్చక్రి సంఘట్టన
త్వగకున్ జచ్చిన నిచ్చలన్ గలుగు జీవన్ముక్తి భక్తాళికిన్॥

మ॥ ఒక పాంచాలిని రచ్చకీడ్చిన దురుద్యోగంబుకై పుత్రమి
త్రకళత్రంబులతోడ మున్ భరతవీర శ్రేష్ఠులీ మాతృభూ
మికి ప్రాణంబులు ధారపోసిరఁట, ఇట్లెన్నేని పాంచాల క
న్యక లేనూర్గుర రచ్చకీడ్చి యభిమానంబూడ్చినన్ సైతురే॥

# అభినవసరస్వతి

పత్రికాధిపతి జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇది యొకమాసపత్రిక, ఇందు ప్రాచీననవీనాంధ్ర ప్రబంధములును, నాటకములును, విమర్శనములును, విద్యావిషయిక మతవిషయిక వ్యాసములును ప్రకటింపబడును. ప్రాజ్ఞసమ్మతములగు తాత్కాలికవ్యాసములవలనఁగలుగు నానందముగాక చందాదారులకు సం॥కు 2-3 అపూర్వగ్రంథము లలవడును. చందా సం॥ 1కి, రు 3-0-0

## మా కార్యస్థానమున వెలకు దొరకు పుస్తకములు.

| | | | |
|---|---|---|---|
| 1 | అళ్వయాచార్యవిజయము | | 0-4-0 |
| 2 | కరిణీకోద్ధారిణి (పూరెవీరభద్రకవి) | | 0-4-0 |
| 3 | వాసంతికా పరిణయము | ఇవి రెండు నాటకములు. | 0-4-0 |
| 4 | కంసవధము | | 0-8-0 |
| 5 | చమత్కారమంజరి (సింహాద్రి వెంకటాచార్యులు) | | 0-4-0 |
| 6 | విరూపాక్షపీఠగురుపరంపర | | 0-2-0 |
| 7 | నీతిగీతులు (సుమతి శతకమునకు సంస్కృతము) | | 0-2-0 |
| 8 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, శాస్త్రిబ్రాహ్మణశబ్దవిచారము | | 0-2-0 |
| 9 | విగ్రహారాధనఖండనఖండనము | | 0-4-0 |
| 10 | చిత్తూరిజిల్లాతీర్పు విమర్శనము (పత్రికాధిపతి) | | 0-4-0 |
| 11 | సంగదోషము | | 0-3-0 |
| 12 | వీరభాగవతము (ముదిగొండవీరభద్రకవి) | | 1-4-0 |
| 13 | పులిందావివాహము (పత్రికాధిపతి) | | 0-4-0 |
| 14 | గురిగింజ, వత్సలనీతిశతకము, వ్యాసనిష్కాసనము, పిష్టపేషణము | | 0-4-0 |
| 15 | శివానందలహరి (తంగెడ రామకృష్ణకవి) | | 0-4-0 |
| 16 | లక్ష్మీవిలాసము (రాయసము వెంకటపతి) | | 0-4-0 |
| 17 | నర్సారావుపేట శతావధానము (తిరుపతి వెంకటీయము) | | 0-3-0 |
| 18 | పశ్యాంపుశ్యాం | ,, | 0-2-0 |
| 19 | పశ్య[illegible]ము | ,, | 0-2-0 |
| 20 | పురశ్చరణము | ,, | 0-2-0 |
| 21 | శంతనురాజచరిత్ర | | 0-14-0 |
| 22 | రజస్వలావివాహఖండనము | | 0-8-0 |
| 23 | వర్ణవ్యవస్థ. | | 0-4-0 |
| 24 | స్వర్ణకారవ్యవహారము | | 1-8-0 |
| 25 | శుద్ధాంధ్రహరిశ్చంద్రచరిత్రము. | | 0-10-0 |
| 26 | తిరుపతి వెంకటేశ్వరతత్త్వము. | | 0-1-0 |
| 26 | సూతసంహిత-ఆంధ్రము. | | 2-0-0 |

అభినవసరస్వతి కార్యస్థానము,

జానపాడు-పిడుగురాళ్ళపోస్టు, గుంటూరుజిల్లా.